

ఓం.

శ్రీనిత్యానందసద్గురు పరబ్రహ్మణేనమః.






# శ్రీనిత్యానందస్వామిభజనకీర్తనలు.

క. శ్రీనిత్యానందగురు। ధ్యానంబునమానసంబు తన్మయముండగ।
నేనొనరించితికీర్తన। లానందముతోడభక్తు లభినందింపగ॥

క. ధరలోనాకిలివేంకట। వరదాఖ్యుఁడసింహనగర వరమునఘువసే।
శ్వరియగ్రహారమందునఁ।బరగియుఁబరమేశసుతునిఁబ్రార్థనసేతుగ॥

౧ కీర్తన.

జంఝూటిరాగం - ఆదితాళం.

ఈశపుత్ర- భాసమానగాత్ర- వాసవాదిదేవమానిస్తోత్ర॥ ఈ॥
గుజ్జురూప- కోమలశరీర - సజ్జనులసదయుచేరగార॥ ఈ॥
మంగళాంగ-భృంగియంతరంగ- గంగసర్వాంగళ- చిత్రాంగ॥ ఈ॥
సత్యశీల-సాధుభక్తపాల- నిత్యానంద- నిగమాంతలోల॥ ఈ॥

౨ కీర్తన.

ధన్యాసిరాగం - ఆదితాళం.

యోగానందకరా- గజాననా। యో॥

శ్రీనిత్యానందస్వామిభజనకీర్తనలు.

ఆగమవందిత హరిహరయసేవిత- వేగమబ్రోవుమురా- గజానన॥ యో॥
ఆదిదేవయో- నిత్యానందా నీదరిజేరితిరా- గజానన॥ యో॥
ధరలోసింహపు- రీశ్వరప్రియసుత వరదకవీశనుత- గజానన॥ యో॥

3 కీర్తన.

కాపిరాగం- ఆదితాళం.

"పార్వతిపుత్రనమో" అనుమట్టు.

శారద- వాణీ- నమో- నమో- నమో- నమోయజురాణి॥ శా॥
వీణాగానలోల- విశ్వరక్షణశీల-
పాణిపుస్తకబాలా- బాల- బాల- బాలభక్తపాలా॥ శా॥
వరరత్నమకుటధారీ- వజ్రమౌక్తికహారీ-
కోటిపాపహారీ- హారీ- హారీ- హారికమలాధారీ॥ శా॥
కానగనిత్యానంద- మానసారవింద-
నమ్రపోషసుఖమొంద-మొంద-మొంద- మొందగుణబృందా॥శా

౪ కీర్తన.

జంఝూటిరాగం- ఆదితాళం.

శంకరా- ఉమామనోహరానమో- నమో-
నమో- నమో-నమో-నమో-
పాకశాస నాదివినుత- పార్వతీశ్వరా-
మా- రా- కా- రా- జాహ్నవీధరానమోస్తుతే॥ శం॥
నారదాదిమౌనివందితా నమో- నమో
నమో- నమో- నమో- నమో-
నీరజాక్షమిత్రశర్వ- నిగమగోచరా-
నా- గా- హా- రా- సుందరానమో- నమోస్తుతే॥ శం॥
కేసరిపురివిహారణా నమో- నమో-
నమో- నమో- నమో- నమో-
దాసవేంకటవరదపోష - దైన్యశోషణా-
ని- త్యా- నం- దా- గురువరా- నమోనమోస్తుతే॥ శం॥

౧ కీర్తన.

చాంలివర్ణమెట్టు - రూపకతాళం.

సాంబసదా భక్తపాల- శరణం- శరణం- శరణం- శరణం॥ సాం॥

అంబానవ- ఆదిపురుష- దయయ- దయయ- దయయ- దయయ॥ సాం॥

నందివాహన- నాగభూషణ- ఇందిరేశతనయ హరణ

బృందారక బృందవంద్య- కరుణ-కరుణ- కరుణ- కరుణ॥ సాం॥

భూమిలోన సింహపురి- ధాముఁడౌ- నిత్యానంద-

స్వామి-యికనేలవేర- కరుణ-కరుణ- కరుణ-కరుణ॥ సాం॥

౨ కీర్తన.

ఆరభిరాగం- ఆదితాళం.

"కొలువైయున్నాడే కోదండపాణి" అనుమట్టు.

రారేసద్భక్తులారా- నిత్యానందునిగన॥ రా॥

పరమాత్ముఁడుఆ- పాపసంహరుఁడు-

కూరిమిఁదోటలో- కొల్వుదీరెనట॥ రా॥ ౧

౨॥ వేదాంత- సద్విచారుఁడు- శతోపనిషద్బోధా- సంతతశీలుఁడు-

సాధులారమీ- సందియమడగును- మోదముచేమీ- పుత్రపౌత్రులును॥ రా॥

౩॥ మారసుందరా కారుని- మంగళకరుని- జేరిప్రాజింత మెగురుని-

సారహీనసం- సారదూరుఁడట- వారిపాదములఁ జేరితరింతము॥ రా॥

౪॥ నరసింహపురవాసుని- వరదునిబ్రోచే- ధాముఁడౌ- నిత్యానందుని-

సారసాక్షియాసర్వేశుండిల- కోరినవారికి- కోర్కెలొసఁగునట॥ రారే

౩ కీర్తన.

హిందుస్తానితోడి- ఆది.

"హాప్రియానినుబాసి" అనుమట్టు.

రామలారారారె సద్గురు- స్వామినిసేవించ రె-

స్వామిని సేవించరేమీ - పామరంబులువీడరె॥ రా॥ ౧॥

భాసరతేజుఁడే యో- పాటలాధరిమ్రొక్కవె-

పాటలాధరిమ్రొక్కవే- యిల- సాటివేల్పుఁగానమె॥ రా॥ ౨॥

## శ్రీనిత్యానందస్వామిభజనకీర్తనలు.

ఆర్యజ వంద్యుఁడే- యీ- అఖిలజగత్పూజ్యుడే-
అఖిలజగత్పూజ్యుఁడే- అతివభూతనాథుఁడే॥ రా॥ ౩॥
పాతకసంహారుఁడేస- త్పరమహంస రూపుఁడే-
పరమహంసరూపుఁడే- భవ్యసహస్రాధారుఁడే॥ రా॥ ౪॥
వాటమైనసింహపురి - మేటిపట్టణాధీశుఁడే-
మేటిపట్టణాధీశుఁడే- యీ- తోటనిత్యానందుఁడే॥ రా॥ ౫॥

౮ కీర్తన.

హిందుస్థానికాపి- ఆది.

"రామమనసా-హరిభజనకు" అనుమట్టు.

రారాజీవా - రాగురుపూజకు-
సరగునిత్యానంద- స్వామిసేవింతము॥ రా॥ ౧॥

౨॥ తల్లిగర్భమున- తల్లడింపుచును- మళ్లిపుట్టియుల మగుపలదగిలేదు-
నెల్లకాలమిటు లాయెనుగద శ్రీ- మల్లికార్జునుని మదిలోఁదలఁచుచు॥ రా॥
౩॥ సతిసుతాదులు- సతమనియెంచుచు- నతిసంతసముననమ్మియుండెదు-
మతిహీనుఁడనామాటలువినియా- భూతనాథునిఁబూజింతముఇక॥ రా॥
౪॥ కాయమునిలువదుకదుబ్రహ్మకును- ప్రాయమునిలుచునా- భ్రాంతియెగా
మాయాతీతుఁడౌ-మహాదేవుని-ఛాయకకొలిచిన-బహుసుఖముండెడు॥

౯ కీర్తన.

ధీరశంకరాభరణం - అటతాళము.

"ఔరాసాకి- అహోకుమారీ" అనుమట్టు.

స్వామిదేవ- శ్రీవామదేవ-
కోమలాంగ- పరమపురుష- గోరితిని సద్గురువర॥ స్వా॥ ౧॥
కరుణారాద- గౌరీవినోద-
వారిజాసనవినుతపురహర - నేరమెమిరశంకర॥ స్వా॥ ౨॥
కోపమేర- పాపసంహార-
ప్రాపుగోరితిగురువరనీ- దాపుఁజేర్చియుఁగావర॥ స్వా॥ ౩॥

సత్యశీల- సాధుపరిపాల-
భృత్యుఁడౌవరదాఖ్యునిలలో- నిత్యానందబ్రోవర॥ స్వా॥ ౪॥

## ౧౦ కీర్తన.

జంఝూటి - ఆదితాళము.

గురునిపూజించు- మనసా- అరమరవీడి॥ గు॥
పరమపావనుఁడే - భక్తరతుఁడే-
కరుణించిబ్రోచువాఁడే- నిరామయుఁడే॥ గు॥ ౧॥
ఆగమవంద్యుని- అఖిలప్రకాశుని-
భోగిభూషణధరుని- నగవైరినుతుని॥ గు॥ ౨॥
సకలాంతరాత్ముఁడే - సగుణస్వరూపుఁడే-
అఖండతత్వాతీతుఁడే- పరమేశుఁడే॥గు॥ ౩॥
సత్యసంకల్పుని- సాధుజనలోలుని-
ప్రత్యగాత్ముఁడౌ దేవుని- నిత్యానందునిసద॥గు॥ ౪॥

## ౧౧ కీర్తన.

హిందుస్తానికాపి - ఝుల్వతాళము.

"గాంచలేకేసదా- కామసైంమెరా" అనుమట్లు.

౧. స్వామినిత్యానందగురుని- సేవజేయుమా- మనసా సేవజేయుమా-
పామరంబువీడ మోక్ష- పదవిగోరుమా॥ స్వా॥
౨. సేవమనసా- దేవుపూజ దినముసేయవే- మనసా దినముసేయవే
భావములోనమశివయని- భజనసేయవే॥ స్వా॥
౩. నిండుమనము తో- నఖండమయునికి- దండమీడవే మనసా దండ
పండువెన్నెలనుండు సద్గురుపొందుగోరవే- స్వా॥
౪. ధరనుసింహపురినిచరితలు- దలచుచుండవే- మనసా- దలచు-
నని మరేల- వరదపాలునినమ్మియుండవే॥ స్వామి॥

## ౧౨ కీర్తన.

ధన్యాసిరాగం - ఆదితాళం.

"రామునిదలచవేమనసా-శ్రీరఘురామునిదలచవెమనసా" అనుమట్టు.

యతిపూజలుజేసెడివారిపుణ్యము - క్షితిలోనెన్నతరమా -
సతతమువారికిసాగిలిమ్రొక్కెడి - సాధుఁబొగడతరమా॥ యతి॥ ౧॥
అనయమువారికిసేవలుచేసెడు- ఘనులఁబొగడతరమా-
మనమునసచ్చారిత్రలుదలచెడు- మాన్యునెంచతరమా॥ య॥ ౨॥
భక్తితోడపదతీర్థముగ్రోలెడు - భక్తులనెన్నతరమా-
రక్తిమీరగాపాటలుబాడెడు- రమణులనెన్నతరమా॥ యతి॥ ౩॥
భిక్షలనడిగెడు ప్రియజనంబుల- దీక్షనెన్నతరమా-
సాక్షిభూతుఁడౌ నిత్యానంద-స్వామిఁబొగడతరమా॥ యతి॥ ౪॥

## ౧౩ కీర్తన.

హిందుస్థానికాపి - ఆదితాళము.

"ఔరాకీచక- పరసతిగోరగ" అనుమట్టు.

గురుమహారాజా- గురుమహారాజా-నిత్యానందసద్గురుమహారాజా॥గు॥ ౧॥
పరమదయాకర- భవహరశంకర- నిరుపమశుభకర - నిర్వికారసద్గురు॥ ౨॥
జ్ఞానవైరాగ్యని-ధాననిపుణసిద్ధ- మానసమందున- మరిపూజించుసద్గురు॥ ౩॥
సాధుసర్వోపధా- సచ్చిదానందా-మాధవరూపా- మంగళవిగ్రహ॥ గు॥ ౪॥
కేసరిపుర- వాసవరదప్యా- వ్యాసయతీశ్వర- వామదేవసద్గురుమహా॥ ౫॥

## ౧౪ కీర్తన.

మురళిరాగం - ఆదితాళం.

రారా- పార్వతీశ- కోరికోరివేడితినిటుశివ॥ రా॥
పరమాత్మ- పరంధామ- పాపహరశ్రీ- పాలించుటకెటు॥ రా॥ ౧॥
భయరహిత- దయరాద- నయముచే బ్రోవర- నాగేశ్వరశివ॥ రా॥ ౨॥
సమయమురా- సర్వేశా-ఉమామనోహర- ఉడుపధరబ్రోవ॥ రా॥ ౩॥
ధరసింహ- పురవాస-నెరసమ్మితిశ్రీ- నిత్యానందగురో॥ రా॥ ౪॥

౧౫ కీర్తన.

హిందుస్తానితోడి - ఆదితాళము.

"కనకరముంచిబ్రోవర" అను మెట్టు.

ఇందుధరా- చంద్రశేఖరా-
నన్నేలర- వందనముసేతుబ్రోవర॥ ఇం॥ ౧॥
కరుణారాజేల- గౌరీమనోహర-
వరగులోసగముద్దీశరా- మనోహర॥ ఇం॥ ౨॥
ఆదిదేవాశంభో- నీదయలేదని-
పాదసేవకునిగావర- కృపయుంచర॥ ఇం॥ ౩॥
కానగసింహపురి కరికరుణనిత్యానంద -
అనయము నన్నేగోల్తుర- సమయమిదేర॥ ఇం॥ ౪॥

౧౬ కీర్తన.

ముఖారి - ఆదితాళము.

"దశరథనందన-దానవభంజన అను మెట్టు."

పరమేశ శంకర, పార్వతీవశంకర -
గిరిజామనోహర- గిరరాడ్విహార॥ ప॥ ౧॥
వరసందివాహన- వసుమతిపాలన-
కరిచర్మధారణ- కరుణించిబ్రోవుము॥ ప॥ ౨॥
పన్నగభూషణ- పరమసంతోష-
సన్నుతమునిపోష- సౌందర్యవేష॥ ప॥ ౩॥
కన్నతండ్రివివ- ఘనుడమహదేవ
నన్నువిడిబోవక- పన్నగశరిగ్యాగశ॥ ప॥ ౪॥
వరయోగసానంద- వర్ణితగుణబృంద-
పరమపావనసింహ-పురినిత్యానంద॥ ప॥ ౫॥

౧౭ కీర్తన.

హిందూస్తానికాఫి- మధ్యఆదితాళం.

"శంకరా సదాశివామహేశ్వర అనుమెట్టు. ,,

శ్రీకరా- ఉమావరా- పరా- త్పరా -

గంగాధర॥ శ్రీ॥ శంకరసురవందితహర॥ శ్రీ॥ ౧॥

పురహరబ్రోవర- నిత్యానంద-గురువరానమోనమోస్తుతే-

పరమపురుషవృషభగమన- భవహరా- నమోనమో॥ శ్రీ॥ ౨॥

గిరిధరయోచంద్రశేఖరా- కరుణజూపుకాలకంధరా-

పరమహంస- పాపధ్వంస- యోగినేనమోనమో॥ శ్రీ॥ ౩॥

౧౮ కీర్తన.

చక్రవాకం - రూపకం.

"నామనవినివినవయ్యా - నాగరాజశయన అనుమెట్టు.,,

నామొరవిని- కరుణించర- నాగరాజవలయ॥ నా॥

ఓముసీంద్రసన్ను తాంగసామీసన్నేలవయ్యా॥ నా॥ ౧॥

మాయామానుషవేష - సంస్తాలమృదుభాష-

మహనీయగుణభూష- మహీభక్తపరపోష॥ నా॥ ౨॥

పరమాత్మ- పరంధామ- పావననుతనామ-

గౌరితిసిబలభీమ-గానీహృత్కుముదసోమ॥ నా॥ ౩॥

వరవార్చితశ్రీపాదా- వాంఛితసత్ఫలబోధా-

అరయగసగమాంతశోధ-ధరనిత్యానందపింద॥ నా॥ ౪॥

గమపధపమ- గమగగరిస॥ నామొర॥

౧౯ కీర్తన.

హిందుస్తానికాపి- రూపకం.

"కమలమిత్రా- కరుణజూడసమయమిదేరా" అనుమెట్టు.

సాంబశివా- దేవదేవ- సర్వపాలకా-

శాంభవీమనోహరనక-శర్వగావర॥ సాం॥ ౧॥

భూతనాథా యేమిసేతు- పాతకహర-
మాతాపితలీవె గావ- మారసంహార॥ సాం॥ ౨॥

కేసరిపురీశావర- దేశపంతమా-
మోసగించినీవేచేదుజగ- దీశన్యాయమా॥ సాం॥ ౩॥

౨౦ కీర్తన.

హిందూతోడి - ఆది.

"శ్రీరామచంద్రా-నన్ను బ్రోవవేమిరా" అనుమెట్టు.

కైలాసవాసా- నన్నుగావవేశివ॥ కై॥

కామకోటిసుందరానన- ప్రేమతోడుతనేలెదనుచును-
నీముమొప్పగనీదుపదములు- నమ్మితి-
రావు లేలరా- కోపమేలరా- పాపసంహార॥ కై॥ ౧॥

దేవదేవనీ- దివ్యనామము - భావము నందేమరక
దలంచితి-యోపరాత్పరా- దాసులబ్రోవను-
గావా- మొరవినవా- సేవజేతురా-
భావజహర- నీవుఇందురా॥ కై॥ ౨॥

నీలకంఠనీ- పాలబడితినన- నీరనుముంచెదో-
పాలముంచెదో- యోగిరీశనీవెట్లుదలంచెదో-
వేరా- వరమీరా- నేరమేమిగా- సద్గురువర॥ కై॥ ౩॥

౨౧ కీర్తన.

ముఖారిరాగం - చాపుతాళం.

గౌరీరమణా- గౌరీరమణా- కరుణనేలు- కామసంహరణా॥ గౌ॥

నెన్నివిధముల- వేడితిగదర- నన్నువిడనాడ- న్యాయమటరా-
చిన్నచూపు-చూచెదవేర- పన్నగభూషణ- ఇటురార॥ గౌ॥ ౧॥

చెప్పనాలిబాధవలన- నుప్పతిల్లెమనను గాన-
అప్పవినునీపాదమాన- ఒప్పుగానన్నేలువేగావ॥ గౌ॥ ౨॥

సంతమేలనిత్యానంద- పాదములకు శరణుజేతురా-
సంతసమున సింహపురి- సాంబమూర్తి- వరదబ్రోవరా॥ గా॥ ౩॥

౨౨ కీర్తన.

కమాసు- రూపకం.

"ఏమిశేతు- ఎటులసైతు - మరులతాళలేనురా" అనువర్ణమెట్టు.

రారాదేవ- కోరినార- నేరమేమి జేసితిరా॥ రా॥
మారకోటి సుందరాంగ- మాంపాలయ- గౌరీవర॥ రా॥ ౧॥
నారదాదిమౌనివంద్య - నమ్మియున్నవాడర-
కరుణవీడియిటులసేయ- గంగాధరన్యాయమేరా॥ రా॥ ౨॥
పరమపురుష- భవవినాశ- పంతమేలరాయీశ-
అరమరేలబ్రోవరాద - ఆగమాంతపరిశీల॥ రా॥ ౩॥
నిత్యానందనిర్వికార- సత్యశీల- సాంబశివ-
భృత్యవేంకటవరద- స్తుత్యశ్రీశివశంకర॥ రా॥ ౪॥

౨౩ కీర్తన.

యదుకులకాంబోది- చాపుతాళము.

స్వామినిత్యానంద- సర్వేశగిరిధర - వేమిసేయుదు గురువరా॥ స్వా॥
కామసంహరనీ- నామమేదలపక -
భూమిలోకాలము- పొందుపొంద గడపితి॥ స్వా॥ ౧॥
ఎన్నెన్నిజన్మము- లెత్తితినో కాని-
నన్నెట్లు కడతేర్తువో - పన్నగభూషణ- పరమేశశంకర-
నన్నాదరించుమా- నాపాలిదైవమా॥ స్వా॥ ౨॥
ఫలప్రాప్తమున్నను- నిలదనకు తానయై-
వలదన్నలభియించును - బలుదుఃఖముండిన-
ప్రాప్తములేనిదే- గలుగదెవ్వరికైన- కామహరణదేవ॥ స్వా॥ ౩॥

ఈశకేసరిపురి- దాస వేంకటవరద-
దాసుని మొరవినర- ఆశతోడుత నేను- దోసిలొగ్గితినయ్యా-
మోసగించబోకు- మునినుతసద్గురు॥ స్వా॥ ౪॥

౨౮ కీర్తన.

కమాసురాగం - ఆదితాళము.

“సారససమముఖపరమవమా” అనుమెట్టు.

శ్రీశివశంకరపరమేశ- వరనిత్యానంద॥ శ్రీ॥

వాసిమీరయీ వసుధసింహపురి-
వాసవరద- హృద్వాసపరాత్పర॥ శ్రీ॥ ౧॥

పరమపురుషనీ- పాదపద్మములు- భవహరనమ్మితిదేవా-
రావా- అరమరేలనట- బ్రోవనీకు బరువా- సురగవననుత-
కరుగదేనీమది- అజనుతపురహర- అంబమనోహర॥ శ్రీ॥ ౨॥

కామహరనాకీ- కన్నులజూడక -
కంటికినిమరరాదాయె- సదయా- నేమిసేతునాకెవరు
దిక్కుగురురాయ- వామదేవనీ వాడననుచుజపా-
ప్రేమతోనేలు పినాకధరేశ్వర॥ శ్రీ॥ ౩॥

౨౯ కీర్తన.

శహానరాగం - అటతాళం.

“అత్తవారింకి- అంపేరు మావారు” అనుమెట్టు.

శంభోమహాదేవ - జయజగద్గౌరీశ-
జంభారినుతశ్రీకర - పరమేశ్వర॥ శం॥

శుంభానిసుంభాది శూరపద్మాలమదవి-
జృంభమాణ విస్రంభణహారశివ॥ శం॥ ౧॥

కుండలీకృతశేష- కుండలీ ప్రబ-
హ్మాండాఘతిమిర-చండకరా- పండితవర్యా-

తాండవనటనోద్దండమహేశ్వర-
ఖండశశిధారణో- ద్దండభైరవయీశ॥ శం॥ ౨॥
కోలాహలాహర- కోటిలింగేశ్వర-
జాలమేలరశంకర- మూలేశ్వర- నీలకంఠేశ్వర॥
నిరుపమశుభకర- నేరమెంచకబ్రోవు -నిత్యానందగురో॥ శం॥ ౩॥

౨౬ కీర్తన.

జంఝూటిరాగం- ఏకతాళం.

"ఖగరాడ్గమనా- నన్నుబ్రోవుమా" అనుమెట్టు.

వృషరాడ్గమనా- మన్నునేలుమా॥ వృ॥
శేషభూషణయఘ- శోషణవరమృదు- భాషణకరుణించుమా॥వృ॥౧॥
నీలకంఠేశ్వర- నిరుపమశుభకర-జాలముసేయకుర॥ వృ॥ ౨॥
భక్తమానసలోల- బ్రహ్మాండపరిపాల- ముక్తినివ్వరచాల॥ వృ॥ ౩॥
కేసనిపురీశ- దాసమనోల్లాస - వరదునిబ్రోవుమీశ॥ వృ॥ ౪॥
స్వామినిత్యానంద - సాధుజనానంద- రామబ్రహ్మానంద॥ వృ॥ ౫॥

౨౭ కీర్తన

శహన - అటతాళము.

"సామిగనాపయి- చలమునుమానర అనుమెట్టు."

ఏమిరశంకర- యేలరబలుకవు-
భూమిలోసింహపుర-స్వామిశ్రీనిత్యానంద॥ ఏ॥ ౧॥
నేరములేమిసే- నీయెడజేసితిని-
వారణచర్మధర- వాదములేలశివ॥ ఏ॥ ౨॥
కోపముపురహర- కోరికదీర్చర-
దాపునజేర్చవేర - దండములిడెదర॥ ఏ॥ ౩॥
వాసిగవేంకట- వరదకవీంద్రుడు-
ఆశతోనమ్మియున్న - హరహరగయేచేదవు॥ ఏ॥ ౪॥

౨౮ కీర్తన

బ్యాగ్ - రూపకం.

ఈశపార్వతీశజగ- ధీశబ్రోవరా- గాసిజెందియున్నానాపై -
కరుణజూపరా- ఆశించినాడర- ఆశిం॥ మోసమేలర॥ ౧॥ ఈ॥

పరమపురుష- భవవినాశ- పార్వతీశ్వర- హరహరశ్రీగిరివిహార-
ఆదిశంకర- పరమాత్మగావర- పర- శరణంటిశుభకర॥ ఈ॥ ౨॥

ఎంతవేడుకొన్నరావు - ఏమిసేతురపంతగించినన్నుసేచ-
పాడిగాదుర- నాచింతదీర్చర- నాచిం- ఇంతపాటమయతవర॥ ఈ॥ ౩॥

నెల్లూరిపురనివాస- నిత్యానందరా- బాలచంద్రధారణనీ-
పదవిసియ్యర- చలమేలగురువర- చల- మూలేశయేలరా॥ ఈ॥ ౪॥

౨౯ కీర్తన.

హిందూకాప - అటతాళము.

"అంగనరో కాంతుడు- నన్నేడబాసెనె అను మెట్టు. "

శంకరపరమేశ- శంభోదయానిధే-
సంకటముడుపర- సాంబసదాశివ॥ శం॥ ౧॥

గిరిధర- గిరిశౌర- పురహరనిరాకర-
వారణచర్మధర - వాయువినిగేశ॥ శం॥ ౨॥

శశిధరపశుపతి- శాశ్వతమహాదేవ-
దశకరబ్రోవర- తాపసవంద్య॥ శం॥ ౩॥

భూమిలోసింహపురి- ధామడౌనిత్యానంద-
స్వామిసద్గురువర- సన్నుతిజేతుర॥ శం॥ ౪॥

౩౦ కీర్తన.

నాటకురంజ - అటతాళము.

"ఎన్నడునీపాద- సేవదొరకుననియున్న అను మెట్టు."

ఎపుడునీసేవనింకెటు దొరకుననియున్న -
నిపుడులభించెను - ఇభచర్మాంబరధర॥ ఎ॥

ఒప్పులకుప్పమా- యప్పనీపదసేవ -
గొప్పమహర్షులకందరాని- యప్పనిత్యానందదేవ॥ ఒ॥ ౧॥
బాలచంద్రధర- బాణుకివద్దనుండ- చాలమార్కండుడు-
చయ్యనమొరలిడ- జాలినొందుచువచ్చి- సరగునరక్షించి-
కాలునితెగటార్చి భక్తుల- నేలునమృతకంఠలింగ॥ ఒ॥ ౨॥
మారకోటితేజ - మంజులమృదుభాష- కోరివేడితిరార-
కువలయేశ్వరధీర- వారిజాసనవంద్య-వామదేవహర-
నారదాదిమునీంద్రగణనుత- నమ్మితినిశ్రీ సింహపురిశివ॥ ఒ॥ ౩॥

## ౩౧ కీర్తన.

### పార్సివర్ణమెట్టు - మిశ్రతాళం.

"రాజరాజతాజరాజ హాటలరాజహెూ అనుమెట్టు"

రారశంభోఫాలనేత్ర- రాజశేఖరా- గౌరీవిహారణి -
గోరివేసారితి- మారసంహార॥
కాలునిపాలిటకాలుడవీవని- చాలగనమ్మితిని- గిరివర-
గిరిధర- కరుణతోబ్రోవర- పురహరమ్రొక్కెదరా-
సురమునివరనుత- కరిచర్మాంబర - సుందరనాట్యకర॥
సుందరనాట్యకర॥ సుందరనాట్యకర ॥ గిరిధర॥ రా॥ ౧॥
వామదేవవరదపాల- స్వామిశంకర - దేవ - కోమలదేహనీ-
నామమెనమ్మితి- భూమిలోసదా- జాలముజేసెద-
వేలమహేశ్వర- బాలమనోహరా- పరిపరివిధముల-
గురువరవేడితి- పరమాత్మశివ- నిరుపమశుభకర-
హరహరిపురివర- నిత్యానందదొర. నిత్యానందదొర॥
నిత్యానందదొర॥ గిరిధర॥ రా॥ ౨॥

౩౨ కీర్తన.

"శ్రీరామచంద్రనన్నుగావర" అనుమెట్టు.

గౌరీశరార- చంద్రశేఖర-
గోరాజగమన- కూర్మితోడుత నెమ్మనంబున- నమ్మితి॥ గౌ॥ ౧॥
రజితశైల- నివాసశంకర- నిజ-
భజనజేతు- వేగబ్రోవర- త్రిజగములువినుతించరా॥ గౌ॥ ౨॥
ఎంతవేడిన- రావదేమిరా-
నాస్వాంతమందునిల్పితినినీ- పంతమేలనగవరా॥ గౌ॥ ౩॥
కేసరీపురవాసదయలేదా- నిత్యానంద-
భక్తవరదుని- మోసగించెదవేలవాదా॥ గౌ॥ ౪॥

౩౩ కీర్తన.

చాంగ్లివర్ణమెట్టు - జుల్వతాళము.

"ఇంతయొకసారినీవు - ఏగుదెంతువా" అనుమెట్టు.

ఏమిసేతుశంకరనా- వెతలుమాన్పరా-
వామదేవ-వరదపాల- స్వామిగురువరా॥ ఏ॥ ౧॥
నమ్మియున్నవారిజెరుప- న్యాయమేహర-
కమ్మవిల్తువైరియింత- కఠినమేలరా॥ ఏ॥ ౨॥
కన్నతండ్రి- ఏవటంచు- నెన్నుకొంటిర-
చిన్నతనము- నన్నుబ్రోవ- పన్నగధర॥ ఏ॥ ౩॥
మోసమేలజేసెదేర- కేసరిపురి-
వాసనిత్యానందమూల- స్థానశ్రీధర॥ ఏ॥ ౪॥

౩౪ కీర్తన.

నాదనామక్రియ - జుల్వతాళము.

"హరతీజయజయ" అనుమెట్టు.

రాగాగౌరీశ- వారణచర్మాంబరధరశివ॥ రా॥
పారా- వారగభీర- కోరితిశ్రీ- నిత్యానంద॥ రా॥ ౧॥

కైలాసా- నిలయా- నీలకంఠ - కాళికాప్రియా-
ఫాల- లోచనాయా- భర్గాయా- గిరీశ్వరాయా॥ రా॥ ౨॥
నారదనుత- నమ్మితిశ్రీ- నగపతిపూజిత-
మారగర్వాపహా- మాంపాహి- మహేశ్వరవినుత॥ రా॥ ౩॥
కేసరిపుర- వాసశంకర- వేంకటవరద-
దాసమనోల్లాస- నీశబ్రోవు- మహేశశంభో॥ రా॥ ౪॥

## ౩౫ కీర్తన.

ఫరజ్ - ఆదితాళము.

"నారాయణనామము" అనుమెట్టు.

ఫాలాక్షునినామము- దలచెశీలురకేనీమము- లేదుసుమీ॥ ఫా॥
బాలుడైన- భూపాలుడైన- స్త్రీలోలుడైనయా- మాలండైనను॥ ఫా॥ ౧॥
భోగిమైనశివ- యోగిమైననిల-
త్యాగిమైనబల్రోగిమైనను॥ ఫా॥ ౨॥
నీమమేలయా- రామందేలను-
కామహరుండా - స్వామినిదలచను॥ ఫా॥ ౩॥
నిష్టుడైనపా- పిష్టుడైనక- నిష్టుడైనను- తల్ప్రష్టుండైనను॥ ఫా॥ ౪॥
నిత్యానందుని- నిర్వికారుని- సత్యశీలుని- స్వామిసద్గురుని॥ ఫా॥ ౫॥

## ౩౬ కీర్తన.

ఇంగ్లీషువర్ణమెట్టు - ఆదితాళము.

శివామనోవిహార్ - భవసాగరసంహారకార్-
కావుముదేవా- నీవిటురావ- సేవజేతుత్రిపురార్॥ శి॥ ౧॥
కైలాసగిరివిహార్ - వలరాజుసూమఫణిహార్-
ఫాలలోచనా- పరమపురుషక్ - పాలనచేయుజోహార్॥ శి॥ ౨॥
నిత్యానందగురోర్- బహుశిష్యలింకశశిధార్-
సత్యపాలనా- సాధుజనావళి- స్తుత్యపటు విషధార్॥ శి॥ ౩॥

### ౩౭ కీర్తన.

హిందూతోడి - చాపుతాళము.

గిరివరయోగా- మారసంహార- పరమపురుష- బ్రోవరా-
    పరమపురుషబ్రోవరా- నీ-కరుణనాపైజిలుకర॥ గి॥ ౧॥
నాగవలయ- నాగకుండల- నాగచర్మధారణా-
    నాగనాగధారణా- వరయోగిగణసంరక్షణ॥ గి॥ ౨॥
ఈశపార్శ్వతీశనీకేక- దోశిలాగ్గితి- గిరివరా-
    దోశిలాగ్గితిగిరివరా-నే- భూసురుండనునేలరా॥ గి॥ ౩॥
స్వామినిత్యానందయతివర- కామకోటిసుందరా-
    కామకోటిసుందర- శ్రీవామదేవసురేశ్వర॥ గి॥ ౪॥

### ౩౮ కీర్తన.

హిందుస్థానికాపి - ఏకతాళం

ఇందుధరా- సుందరదేవ- బృందవందితా-
    వందనమోనందీశ్వర- సింధుగంభీర॥ ఇం॥ ౧॥
నీరజాక్షమిత్రఘనా- కారవిస్తారా-
    సూరిజనవంద్యనిర్వి- కారశంకరా-
రారా- మారా- కారా- వరకరుణ-
    గిరిధరణ- హేపరాక్రమా॥ ఇం॥ ౨॥
స్వామినిత్యానందబ్రోవ- వేమిరాహరా-
    కామజేత- కలుషహరణ- యోమహేశ్వరా-
రావా- బ్రోవా- కావా- అసురహర-
    భసితధర- హేపరాత్పరా॥ ఇం॥ ౩॥

### ౩౯ కీర్తన.

"బలభీమా- బలభీమా" అనుమెట్టు.

పరమేశా- భవనాశా॥ ప॥
    సరగునసీవిటురావా- శశిధర॥ ప॥

పరాత్పరాహిమ- గిరిజారమణా-
పామరుడనునేదేవా- శశిధర॥ ప॥ ౧॥
పాపములను నెడ- బాయశేయవె-
తాపసనుతమహాదేవా- శశిధర॥ ప॥ ౨॥
ధరసింహాపుర- నిత్యానందా-
దయనేలనెగుణబృంద- శశిధర॥ ప॥ ౩॥

## ౪౦ కీర్తన.

మాయామాళవిగౌళ - ఆదితాళము.

గౌరీమనోహర- కామారీశివ॥ గౌ॥
హరహరగిరివర- ఆదిదేవాశంభో-
మురహరనుతవిశ్వ- మూర్తనేశివ॥ గౌ॥ ౧॥
శశిశేఖరయో- శమనగర్వాపహ-
పాశుపతాధర- భయహారిశివ॥ గౌ॥ ౨॥
నిరాకారశ్రీ-నిత్యానంద-
గౌరితికలువ- కుమారిశివ॥ గౌ॥ ౩॥

## ౪౧ కీర్తన.

హిందుస్థానిరాగం - ఆదితాళము.

ఇందుధరా- వేమిదోచదేర-
వందనము- వ్యోమకేశరార॥ ఇం॥ ౧॥
ఫాలనేత్రా- పంకజాక్షమిత్ర-
నీలకంఠజాలమేల- త్రినేత్ర॥ ఇం॥ ౨॥
దిక్కులేరు- దిక్కునీవెగాన-
చక్కనయ్యామ్రొక్కినాను దేవ॥ ఇం॥ ౩॥
నిత్యానంద- నిన్నువిడనాడ-
సత్యశీల- సమయమెనకీడ॥ ఇం॥ ౪॥

## ౪౨ కీర్తన.

### హిందుస్థానికాపి - ఆదితాళము.

ఇందుమౌరార- సుందరపదారవింద॥ ఇం॥

అందమౌనిపదమంద- గౌరితిసురబృందానంద॥ ఇం॥ ౧॥

నాగాభరణవరయోగా - నందయౌరాగా-

రహితశివభోగావేగ॥ ఇం, ౨॥

భూమిని- సింహపురి-

ధాముడౌనిత్యానందస్వామి-నాపైనిప్రేమజూపు॥ ఇం, ౩॥

## ౪౩ కీర్తన.

### వసంతరాగం - ఆదితాళము.

భజేసదాశంకర- బ్రహ్మాదిదేవం॥ భ॥

సుజనామనోహరం- భజేసదాశివం॥ భ, ౧॥

కైలాసవిహారం - గౌరీమనోహరం-

బాలేందుమకుటధరం- ప్రణవఓంకారం॥ భ, ౨॥

ఫాలాగ్నినేత్రం- బ్రహ్మాంశసూత్రం-

విలసిల్లునిత్యానంద- విమలచారిత్రం॥ భ, ౩॥

## ౪౪ కీర్తన.

### సావేరి - ఆదితాళము.

నిత్యానందునిసేవ- నిపుడుదొరికెనిక-నిరుపమానముగ శ్రీ॥ ని॥

సత్యశీలులును- సకలజనంబులు-

సాగిలిమ్రొక్కుచు- సన్నుతిజేయ శ్రీ॥ ని, ౧॥

రాజశేఖరుడు- రాజమార్గమునరాగా-

భజనలుసేయుచుబాగా- ద్విజవరులును- వింజామరములు-

వీచుచువేగా - విజయీభవాయన-

సుజనబృందములు- సొంపుతోనడచుచు-

గజిబిజిబడుచును- కడుసంభ్రమమున-

విజితసింహపురి- వీధులజనములు-
భజయించిరి- బంమహాదేవయనిశ్రీ॥ ని ౨॥

౪౫ కీర్తన.

శుద్ధసావేరి - అటతాళము.

నేజేయుపూజగైకొనుమా-
ఉడురాజమకుటధర - రాజరాజేశ్వర॥ నే, ౧॥

నల్లకలువలుచామంతి- మంచితెల్లగన్నేరుపూబంతి-
మల్లెలుమొల్లలు- మరినందివర్ధనలు-
తెల్లకలువలుపచ్చ- ముల్లుగోరింటలు॥ నే, ౨॥

పొన్నలుపొగడలును- వికసించినసన్నజాజివిరులును-
వన్నెకస్తురిపట్టె- వరతులసిదవనము-
పన్నీరుకుసుమముల- పారిజాతంబుల॥ నే, ౩॥

మారేడుదళములను- వాసనగలమరువంపు- మొలకలను-
తీరైనదాసానితీగ- సంపెగతుమ్మి-
ఆరామలింగాక్షి- నానావిధంబుల॥ నే, ౪॥

కేసరిపురవాస- వేంకటవరద-
దాసమనోల్లాస- భాసమానసేనీ- పదములనర్చింతు-
నీసమానమెవరు- నిత్యానందగురో॥ నే, ౫॥

౪౬ కీర్తన.

నారాయణగౌళ- జుల్వ.

"నారాయణాచ్యుత- నరహరకేశవ" అనుమెట్టు.

సాంబాసదాశివ- సర్వేశగిరిధర - శాంభవీమనోహర॥ సాం, ౧॥
కైలాసవాసశ్రీ- కరకంఠఫణిధర- నీలలోహిత శంకర॥ సాం, ౨॥
ఏలరయాచల- మేలబాలునిపైని- చాలగదయయుంచర॥ సాం, ౩॥
ధరసింహపురిఈశ- దాసమనోల్లాస- వరమునిబ్రోవుమీశ॥ సాం, ౪॥
నిరుపమశుభకర - నిఖిలగుణాకర- నిత్యానందగురువర॥ సాం, ౫॥

## ౪౭ కీర్తన.

జంఝూటిరాగము - ఆదితాళము.

దండకమండల- కాషాయాంబర-
ధారిశ్రీశంకర - ఖండపరశుహర॥ దం॥ ౧॥
దక్షుధ్వరహర- దానవభంజన-
రక్షించరహా - లాక్షాశ్రీకర॥ దం॥ ౨॥
పశుపతిపాలన- పావకలోచన-
శశిధరమకుటనా- సన్నితిగొనుఘన॥ దం॥ ౩॥
పంచవక్త్రిస- త్పరమహంసనజ-
నంచకగావరనిత్యానంద॥ దం॥ ౪॥

## ౪౮ కీర్తన.

శుద్ధకాంభోదిరాగము - ఆదితాళము.

జయఉమాపతే- జయగిరీపతే-
భయనివారణా- పాపశోషణా॥ జ॥ ౧॥
ఇందుశేఖరా- సుందరాకార-
వందనంబిదో- వాదమానాతో॥ జ॥ ౨॥
శంకరీధవా- యింకసేలవా-
పంకజజనుత- భక్తసేవితా॥ జ॥ ౩॥
నీలకంధరా- బాలసుందరా-
హాలహాలధర- ఆదిశంకర॥ జ॥ ౪॥
కేసరీపురీ- వాసశ్రీధరా-
నేరమేమిర- నిత్యానందరా॥ జ॥ ౫॥

## ౪౯ కీర్తన.

అపరూపరాగం - జుల్వతాళము.

"బాలకమతీ -దీనమతీ- ఘనసురస్వతిబోలె" అనుమెట్టు.

నీలగ్రీవనన్ను గావు- నిత్యానందదేవ-

గురుదేవ- పరాత్పరగిరి- వాసమహాదేవ॥ సీ॰ ౧॥

కాలకంఠ- జాలమేల- నేలుసత్యసీల-

సత్యసీల- పరంధామశంభో- సాధుజనలోల॥ సీ॰ ౨॥

మారహర- కోరినార- నేరమెన్నకుర-

వరశూర- నెరనమ్మినార- విశ్వధవారార॥ సీ॰ ౩॥

కేసరిపురీశవరద- దాసమనోల్లాస-

సువిలాస- శ్రీపార్వతీశ- సుందరమహేశ॥ సీ॰ ౪॥

౫౦ కీర్తన.

హిందూతోడిరాగము - ఆటతాళము.

"రాడేమాయకాడె" అనుమెట్టు.

రారా- శివదేవా॥

మారహరణ శ్రీమహేశ్వర- నిజ- గౌరితికైలాసమందిరా-

సారసాక్షమిత్ర- సమయమురాయికే॥ రా॰ ౧॥

పరమాత్మ గారీశనమ్మితి- నీ- చరణములనుమదిజగౌరితి-

నరమరలేలను- వరములియ్యరఈశ॥ రా॰ ౨॥

కేసరిపురవాస- నిత్యానందా-

దాసులదయజూడభారమా-

వాసిగవేంకట- వరదదాసుసేల॥ రారా॰ ౩।

౫౧ కీర్తన.

హిందుస్తాని జంఝూటిరాగము - ఆదితాళము.

శివగురుదేవా- శివగురుదేవా-

శీతాంశుధర- శివామనోభావా॥ శి॰ ౧॥

సురనరసేవిత- సుందర[illegible]-

వరమునిపాలిత- వందనమోహర॥ శి॰ ౨॥

గంగాధరభవ- గౌరీమనోహర-

అంగజారిలోకకృపా- పాంగభస్మాంగ॥ శి॰ ౩॥

ఇందిరపతిగోవింద- వందితసా-
నందనందీశ్వర- ఇందుమకుటధర॥ శి॥ ౪॥
ధరలోశ్రీసింహ_ పురమూలేశ్వర-
నిరుపమశుభకర - నిత్యానందా॥ శి॥ ౫॥

౫౨ కీర్తన.

కాంబోధిరాగము- ఆదితాళము.

"హారతిభువన సుందరాతి" అను మెట్టు.

హారతీ- రజితశైలభాతి- పార్వతీధరయనంగభూతి - నిర్గుణనిర్వికారమూర్తి- నిరంజననిత్య సత్యకీర్తి- దేవాదేవదేవమూర్తి - త్ర్యంబక నందిభృంగికీర్తి - ప్రళయసమయమోదీ- శంకర- నటనచిద్భా- నటనదిగ్విభాప్రభా- ధరాధరాధర- హారపత్రశ్రీ- గౌరిమను స్వామి-జయతిభవానీవసామి॥ హా॥ ౧॥ నమ్మినవానిపైనకరుణ- యుంచుముసమ్మతిగా యికను - సకలమునీవేదభ్యతరణ- సన్నుతనివంద్యదివ్యచరణ- రారారామహిమాత్మగమన-పావకరాజసూర్యనయన - జాహ్నవిబాలచంద్రధరణా- ధరనుకేసరీ - పురీమహేశ్వర- గిరివరామర-పూజితాంఘ్రియుగళ-నిత్యానందదేవలీలా॥ హా॥ ౨॥

౫౩ కీర్తన.

మంగళహారతి.

"దేదీప్యమాన-విగ్రహునకు-దీపహారతి" అను మెట్టు.

దేవాదిదేవుశంకరునకు- దివ్యహారతి-
ఈవిశ్వసుభక్తవరద- ఏకహారతి॥ దే॥ ౧॥
మాయాతీతునకుద్వి- తీయహారతి-
త్ర్యంబకనికుత్రి- తీయహారతి॥ దే॥ ౨॥
నారదాదిమౌనివంద్య- నాగహారతి-
పరమపురుష గైకొనుమిదె- పంచహారతి॥ దే॥ ౩॥
నిష్టతోడనిచ్చెదయీ- షష్ఠమహారతి-
స్రష్టనుతా- నన్నుబ్రోవు- సప్తహారతి॥ దే॥ ౪॥

శ్రీనిత్యానందస్వామిభజనకీర్తనలు.

శిష్టజనారత్నంశివ- అష్టమహారతి-
నష్టకష్టములనుబాపు- నవమహారతి॥ దే॥ ౫॥
దాసజనులబ్రోవుశూలి- దశమహారతి-
నాశరహితగావుమఏ- కాదశహారతి॥ దే॥ ౬॥
గౌరీశాపశుపతిమేల్- తారహారతి-
క్రూరుడ- కరుణించుమీశ- కుంభహారతి॥ దే॥ ౭॥
నిత్యానందసద్గురువర- నీకుహారతి-
సత్యశీల - యతికులేంద్ర- స్యందనహారతి॥ దే॥ ౮॥

౫౪ మంగళహారతి.

జాతిస్వరంరాగము- జుల్వతాళము.
"మంగళంహాగీ" 'అను మెట్టు.

మంగళంశివా- మమ్ముబ్రోవవా- గంగాధరేశా-
కరుణించుమీశా- శృంగారవేషా- భృంగీనటేశా॥ మం, ౧॥
మారసంహార- నీమరుగుజేర్చర- కోరితిగదర-
కోమలకార- దరిజూపవేర- గిరిజామనోహర॥ మం, ౨॥
నందివాహన- వరనాగభూషణ- సింధుగంభీర-
శీతాంశుధర- మందరధీర-మాంపాహి-ఈశ్వర॥ మం, ౩॥
కేసరిపురి- వాసశంకర- ఆళించినార-
మోసమేలర- ఈశుడరార- నిత్యానందగురో॥ మం, ౪॥

౫౫ మంగళం.

యదుకులకాంభోధిరాగము- జుల్వతాళము.

మంగళంబు మేశా- మమ్మేలుమహేశా-
రంగుగసద్భక్తవరుల-రక్షించుగిరీశా॥
పరమేశా- భవనాశ- జగధీశా॥ మం, ౧॥
నీలకంఠరార- నే- నిన్నునమ్మినారా-
ఫాలనేత్ర- భసితగాత్ర- భాషింపవదేర॥
నిటురార- వరధీర- శుభకర॥ మం, ౨॥

ఇందుమౌళిదేవా- నా- వందనమిదెబ్రోవా-
సుందరాంగ- సూరిజనా- బృందవంద్యశర్వా॥
ననుగావ- గతిపేవ-ధోరవీవ॥ మం, ౩॥
స్వామినిత్యానంద- సత్యజ్ఞానయోగసంధా-
క్షేమకీర- బ్రణవనాద- బ్రహ్మామూలస్కంధ॥
సురబృంద- సానంద- జయమంద॥ మం, ౪॥

౫౭ మంగళం.

జాతిస్వరంరాగము-ఝల్వతాళము.

హారతిభవా- ఆదిదేవా- అమరశివ- యంబికాధవా॥
పరాత్పరాయ- నన్నుగావ- భారమేశివా॥ హా, ౧॥
ఫాలలోచనా- ప్రాణధనా- పాపహనా- పతితపావన॥
నీలకంఠనిర్వికార-నిగమగోచర॥ హా, ౨॥
సత్యపాలన- సాధుజనా- స్తుత్యఘనా- సర్వకారణా॥
నిత్యానందస్వామికృపా- నెరవుమోఘనా॥ హా, ౩॥

౫౮ మంగళం.

నాదనామక్రియరాగము- ఝల్వతాళము.

హారతీజయజయ- శ్రీ- సతిపతి- హితునకుకర్పూర॥ హా॥
నిరాకారునకు- నీలకంఠునకుమంగళ॥ హా, ౧॥
వేదాతీతునకు- యా- విధినుతపదునికి- ముత్యాల॥
సాధూమానసునకు- సామగాన- ప్రియునకుకర్పూర॥ హా, ౨॥
మూలాధారునకు- శ్రీ- విలశిలుశూలికిమేలగు-
కాలాకాలునకు - పాలితనిత్యానందునకు॥ హా, ౩॥

౫౯ మంగళం.

యదుకులకాంబోధిరాగము- ఝల్వతాళము.

"పార్వతీప్రియాయతే- భవ్యమంగళం" అనుమట్టు.

శివామనోహరాయభక్త- సేవ్యహారతి-
దేవదేవదివ్యలింగ- దీపహారతి॥ శి, ౧॥

నిగమగోచర- నిర్గుణాయ- నిత్యహారతి-
అఘవిదూర- ఆదిపురుష- సగుణహారతి॥ శి, ౨॥
భృగినాట్యవి- నోదశంభో- పూర్ణహారతి-
అంగజాకారవృషతు- రంగహారతి॥ శి, ౩॥
ఫాలలోచనాయశంకర - పంచహారతి-
నీలకంఠ- నిర్వికార- మేలుహారతి॥ శి, ౪॥
శాంభవీమనోహరాయ- కుంభహారతి-
జంభదమన- వినుతఆపో- జ్యోతిహారతి॥ శి, ౫॥
నిత్యానంద- స్వామివర- నీకుహారతి-
సత్యజ్ఞానా- నంతబ్రహ్మ- స్వామిహారతి॥ శి, ౬॥

౫౯ కీర్తన.

సౌరాష్ట్రరాగము - ఆటతాళము.

బువ్వంబంతిపాట.

కోమలాధారి- రుక్మిణి- కోసలాధిపతేరాజం అనుమెట్టు.

రారాలారా- రారెచూతాము- స్వామినిత్యానందబువ్వము-
ప్రేమమీర- భక్తులీవేళ- కోమలాంగీ- కొల్వమరినారే॥ రా, ౧॥
పప్పుకూరలునుపచ్చళ్ళు- బాగుగాను- కలవన్నములు-
అప్పడములువడియములు- గొప్పలగుజరిటాకులు॥ రా, ౨॥
పంచదార- పాయసములు- మంచివెన్న- తేనెమీగడలు-
చంచలాక్షివడలత్రిసములు- వంచనలేక వడ్డింత్రు॥ రా, ౩॥
లడ్డుపూరీలుజిలేబి- యిడ్డెనదోసెలాంవడలు-
గడ్డపెరుగుమణుగుపూలు- అడ్డిలేకవడ్డించెరే॥ రా, ౪॥
పనసజంబు- ద్రాక్షఫలములు- ఘనమౌలగు మామిడిపండ్లు-
వినవెతేనెయరటిపండ్లు- ఇంపైన- దాడిమపండ్లు॥ రా, ౫॥
వెలగపండ్లు- జామపండ్లు- వేరుపనసపండ్లివెచూడు-
పులుపులేని- నజీనిమ్మపండ్లు - బుల్బుటోడి- కిచ్చిలిపండ్లే॥ రా, ౬॥

సీతాఫలము- రామాఫలము- ఖ్యాతిమీరిన- అంజూరుపండ్లు-
నాతిమంచినారికేళములు- హితవుగానుభుజియించెదరె॥ రా, ౭॥
బోటిరో నెల్లూరిమూల- పేటయాకిలి- వేంకటవరద-
వీటియందుసద్భిక్షులు- దీటులేకజరుగుచున్నవి॥ రా, ౮॥

౬౦ కీర్తన.

ముఖారిరాగము- ఆదితాళము.

బువ్వబంంతిపాట.

"చెడెరో- చిటిబొమ్మలపెండ్లి- చూతామురారె" అనుమెట్టు.

చెలియారోయీ- శంకరుపూజా- చేతామురారె-
నీలకంఠునిబువ్వమువేడుక- నీప్రహెజూతామె॥ చె, ౧॥
నాతిరోవీ- భూతిదాల్చినసదు- రొద్యాందెవరమ్మ-
మాతాపిత్రు- రహితుడగుభూత- నాథుడుగాదటవె॥ చె, ౨॥
వ్యాఘ్రాజినమును- ఒనరధరించిన- వారలువీరెవరె- గొప్ప॥ వర॥
శీఘ్రముగ- వరమొసగెటిపర- శివుడు- గాడటవె॥ చె, ౩॥
జటలోగంగాచంద్రులదాల్చిన- జాణుండితడెవడె- నెర
జాణుం- బోటీమదన- కోటిసముడు- నటేశుడుగాదటవె॥ చె, ౪॥
నాగాభరణము- బాగుగమెరసే- యోగీయితడెవరే- వర- యోగీ-
రాగాదిషడ్వర్గములణచిన- రాజశేఖరుండే। చె, ౫।
కేలమునందుత్రి- శూలముదాల్చిన-
బాలాయితడెవరె- పసి- బాలా॥
హాలాహలమునుహరియించినఫా- లాక్షుడు గాదటవె॥ చె, ౬॥
నందివాహనమునమెరసే- సుందరుడితడెవడె- బహు- సుంద॥
అందముగకైలాసమునేలే- హరుడుగాదటవె॥ చె, ౭॥
వామాభాగమున- వనితనుజేర్చిన- రామాయితడెవడే- ఓ॥ రా॥
కామితార్థములనొసగు- సుమాపతిగాదటవె॥ చె, ౮॥
కోమలాంగీ- సింహపురవర- ధామునిడితడెవడే- పరం- ధామ॥
భామామణిరో- నిత్యానంద- స్వామిసద్గురుడె॥ చె, ౯॥

## ౬౧ పంచ కందార్ధములు.

౧. మనసా। సద్గురునెంచక। ఘనముగనిలదిరుగనీకు। గౌరవమగునె। అన యము పెద్దలగనుగొని। వినయంబువవారిబోధ॥ వినినదుచుకొనుమా- మనము నగురు- జ్ఞప్తిచేకొనుమా॥ బనిబూనినీవు- సద్భక్తియుక్తముగాను- గొసకొ నిదలచుచు- కోర్కెలుడిగెడుపదవి॥ లినినడచుకొనుమా॥

### కందార్ధము.

౨. పరమేశు। పరంధాముని। వరనిత్యానందగురిని। వైఖరితోడన్। చర ణంబులాశ్రయించిన।గురుతుగచాపములుదొలగి। బోవును-కరుణచెనిస్మ్న-గా చును॥ ధారుణినితర-దైవములనుమది-గోరకశంభుని-జేరవెమనసా- గాచును॥

### కందార్ధము.

౩. నిత్యానంచునిశంభుని। సత్యాత్మునిసాధుపోషు। సమరసభావున్।ప్ర త్యాహారసుశీలుని। నిత్యముసేవించుమనస। నిఖిలసద్గురుని- అత్యంతసుబోధా శేఖరుని॥ ప్రత్యగాత్ముడైన - ఫాలలోచనుని- భృత్యుడవయ్యాను - ప్రేమగ న్గొనసీవు॥ నిఖిలసద్గురు॥

### కందార్ధము.

౪. అనమరనొందకుమనసా। పరమార్ధములెంచినీవు। ప్రజ్ఞదలిర్పన్।సర సునసమభావంబున। వరనిత్యానందస్వామి। వరునిపూజించు॥ వారినిమదిలో- హాయగభావించు॥ నిరుపమాపోజ్యోతి-నీలతోయదమందు- నిరతమునిలిపియు- నిర్వికారుండవై॥ వరునిపూజించు॥

### కందార్ధము.

౫॥ కడతేరరాదమనసా। పుడమినిగురుపూజచేశి। పోడిమితోడన్। ఎడనె డ। సద్గురుబోధను। విడువకసుజ్ఞానయోగ విధమునువినుము। అపోజ్యోతి। న తివేగగనుము। పండువెన్నెలలందు। నిండివెలింగెయా। ఖండునిత్యానందు। దండిబ్రహ్మముజెందె॥విధ॥

## ౬౨ ఏలలు పాట.

కాంబోధిరాగము - ఆట తాళము.

నిత్యానంద- నిర్వికార- సత్యశీల- సాధుపోష- నృత్యగీతానంద పర మేశ- ఓనిత్యానంద- నిత్యమునిన్- స్మరియింపుచుందురా॥ ౧॥ గంగాధర - కల్మషహార- మంగళాంగ కలింగేశ్వర- అంగజసంహారగౌరీవర- ఓ- ఓనిత్యానంద- భృంగినాట్యవినోదశంకర॥ ౨॥ భూతేశ్వర - భూతాధార - భూతాభావ- భువిపరిపాలా- నాతోబల్కు- వేరగురువర- ఓ- ఓనిత్యానంద-చేతులార- పూజసేతురా॥ ౩॥ పరమపురుష- పార్వతీశ- శరణుశరణు మహేశ్వర- వారిజాసనవంద్య- శశిధర- ఓ- ఓనిత్యానంద- వేరుగాను- నన్నుబ్రోవరా॥ ౪॥ స్థిరముగాను- సింహపురిని- పరిపాలింపుచుండునట్టి - గిరిధరనీచరణముల్- విడువరా- ఓ- ఓనిత్యానంద- కరుణతోడవరములియ్యరా॥ ౫॥

## ౬౩ తలువులీశెపాట.

సౌరాష్ట్రరాగము - ఆదితాళము.

శంకరభువనవ- శంకరయీశ్వర- శాంకరిధవననుబ్రోవు-శివ- యింకనన్ కరుణతోగావు॥ ౧॥ పరమపురుషనీ- పాదపద్మములు - భవహారనమ్మితిదేవ- హర- శరణామహానుభావ॥ ౨॥ నీలకంఠనా- నేరములేమిర - నినువిడనాడమహేశ- ఈచలమేలనుపరమేశ॥ ౩ ॥ శశిశేఖరయీ- శానపరాత్పర- శంభోదయానిధేరార- ఓ- పశుపతిబల్కవుపరా॥ ౪॥ ఎంతవేడిన - పంతగించెదవు- ఏలరకోపముసాంబ- నా- చింతదీర్చుశశిబింబ॥ ౫॥ విశ్వేశ్వరయో-విశ్వరూపనీ - శాశ్వతపదవినినిమ్ము- స- ర్వేశ్వరనమ్మితిమిమ్ము॥ ౬॥ ధరలో సింహ- పురీశ్వరవేంకట - వరమునిమొరవినరాదా- దేవా- సరగున నేలరవాదా॥ ౭॥ సత్యశీలవర- సాధుజనావన - నిత్యానందస్వామి- కృతి- నీకొసగితినిగైకొమ్మి॥ ౮॥

## ౬౪ హెచ్చరిక.

సౌరాష్ట్రరాగము- రూపకం.

శ్రీశంకర- పరమేశ్వర- శీతాంశుధరణా- ఆశించితి- నీపదవిమ-హేశా- హెచ్చరిక॥ ౧॥ కాలామునిపాలాగుణ- జాలావరచేలా- కోలాహలధరగళశివ- లోలా హెచ్చరిక॥ ౨॥ కోటిభాస్కర తేజా- కోమలాకార- ఘోట

కామగచాప- నటేశా- హెచ్చరిక॥ ౩॥ పార్వతీధవరూప్యా- పర్వతవరధర- గర్వితమదనాంతక- శర్వా హెచ్చరిక॥ ౪॥ భూమినిసింహపుర- వాసా- స్వామినిత్యానంద- ప్రేమునన్నేలుముపరం- ధామ హెచ్చరిక॥ ౫॥

౬౫ కీర్తన.

మధ్యమావతిరాగము- అటతాళము.

“లాలిగో పాలకృష్ణ” అనుమెట్టు.

లాలి- శ్రీనిత్యానందలాలి- సద్గురుశివ॥ లాలి॥ లాలిబుధజన పాలపార్వతీలోలనేకగుణాలవాల॥ లాలి॥ ౧॥ కైలాసగిరిశిఖరమందు- ప్రమథాదిదిక్పాలురుగొల్వనోలువునందు- మేలైనరత్న- ములమెరయుడోలికనందు- బాలశైలజలీలతోలత- చాలచెలగెడు - నీలలోహిత- బాలికలు - పదివేలకోలదియు- కేలనోలసులుసూనిపాడగ॥ లాలి॥ ౨॥ వారకాంతలునాడగాను- భూసురవలి- జేవేదములెజదువగాను- పుణ్యాంగనలు- గోరక్షీరాజన మివ్వగాను- మీరితనసరి- వారిమెల్లను - సారసతుల్యచామరాదుల- సారసాక్షులు వీచుచుండగ- సార్వభౌముడవైనశంకర॥ లాలి॥ ౩॥ విరులుబరచిన పాన్పునందు- సుఖమందపార్వతి- చరణసేవయే- జేయుచుండ - వరనారదులె- సరగునవీణెమీటిపాడ- నారిమణులేతాకుమడుపులు- నేర్పుమీరయొసంగ యోగచారుడై వేంకటవరదుడు- కోరియయ్యల- లూపసాగెను॥ లాలి॥ ౪॥

౬౬ కీర్తన.

శుద్ధసావేరిరాగము- ఆదితాళము.

“దేవమంగళం- మహానుభావమంగళం” అనుమెట్టు.

ఈశమంగళం- పరమేశమంగళం- కేసరిపురవాసనిత్యానందమంగళం॥ దే, ౧॥ శంభోమంగళం- స్వయంభుమంగళం- జంభభేదివినుతదేవ-జయతుమంగళం॥ దే, ౨॥ శూలిమంగళం- వర- కపాలిమంగళం- బాలచంద్రధరణసత్య- శీలమంగళం॥ దే, ౩॥ కామమంగళం- పరం- ధామమంగళం- వామదేవ- వరదపాల- స్వామిమంగళం॥ దే, ౪॥

శ్రీనిత్యానందస్వామిభజనకీర్తనలు

సంపూర్ణము.



